శ్రీరామచంద్ర ప్రసన్నః



# శ్రీ రామ నామ సంకీర్తనము

రచయిత: బి. సీతారామరావు, యాడికి.

శ్రీ ప్రమాదీచనామ సం॥ ఆషాఢ బ॥ ౫ లు
జరిగిన శ్రీరామ పట్టాభిషేక సందర్భమున
బసవరాజు సీతారామారావు గారిచే
రచింపబడి
శ్రీ సీతారాముల దివ్య పాదపద్మములందు
సమర్పింపబడినది.

# శ్రీరామనామ సంకీర్తనము

ప్రథమ ముద్రణ 1973
ద్వితీయ ముద్రణ 1997

## శ్రీ సీతారామాభ్యాం నమః

1. శ్రీరామ జయరామ జయజయ రామ
జయజయరామ జానకిరామ
పావనరామ పట్టాభిరామ
కళ్యాణ గుణధామ కాకుత్స్థరామ ॥శ్రీ॥

2. కామారినుతనామ కమలాక్షరామ
క్రూరారిగుణభీమ కోదండరామ
సామీరినుతనామ సాకేతరామ
సవితృమండలధామ సర్వేశరామ ॥శ్రీ॥

3. నిఖిలదైత్యవిరామ నిత్యాత్మరామ
శ్రుతి శిరోమనుతనామ క్రతురూపరామ
ఇందీవరశ్యామ ఇనకోటిధామ
సౌందర్యజితకామ జగదభిరామ ॥శ్రీ॥

4. అఖిలావనోద్ధామ ఆనందరామ
కృతగాధిసుతహోమ నుతగేయరామ
శ్రితతాపహరనామ శ్రీపరంధామ
నిగమాంతనుతభూమ నిష్కామరామ ।శ్రీ।

5. వినుతామరస్తోమ విశ్వేశరామ
సనకాదినుతనామ సత్యాత్మరామ
ధృతదివ్యసుమదామ సితయశఃకామ
రాజలోకలలామ రఘువంశరామ ।శ్రీ।

6. పతితపావననామ పరమేశరామ
అఖిలతత్త్వగ్రామ ఆధారరామ
కాంతినిర్జితసోమ కారుణ్యధామ
జితభృగూద్వహరామ శ్వతిరూపరామ ।శ్రీ।



7. దశరథాత్మజదేవ రామావతార
తాటకేయాది క్రవ్యాదసంహార
గాధేయ యాగరక్షక దివ్యరూప
మునిమానినీసు సంహృత ఘోరపాప ।శ్రీ।

8. హరచండ కోదండ ఖండనోద్దండ
సితకీర్తి పూరితాఖండ బ్రహ్మాండ
శ్రీజానకీ ప్రాణనాథ మన్నాథ
జితహరణీనాథ శ్రీజగన్నాథ ।శ్రీ।

9. పితృవాక్య కరణైక ధర్మస్వరూప
ఘన దండకారణ్యగత వినిర్లేప
మునిమానసాబ్జ సంచరణ షట్చరణ
పరిపూర్ణ కల్యాణ గుణగణ భరణ ।శ్రీ।

10. ఖరదూషణాదిదైతేయ సంహరణ
కపటమారీచాసుర ప్రాణహరణ
సీతావియోగార్ధ మిథ్యాప్రలాప
వరజటాయు విముక్తికరణ నిష్పాప |శ్రీ|

11. పంపాసరః తీరగత చిదానంద
వాయునందన సేవ్య చరణారవింద
రవి తనూభవమిత్ర రమణీయగాత్ర
సురపతి ప్రియపుత్ర తరునీతిహోత్ర |శ్రీ|

12. లంఘితార్ణవవాయుజ స్తోత్రపాత్ర
నిజకథాపులకిత జనకజాగత్ర
కపివీర కథితభూపుత్రికాచరిత
అఘట ఘటనాప్రవీణ సద్వినుత |శ్రీ|



13. ప్రబలవానర చమూయుత జైత్రయాత్ర
మారుతాత్మజ హృదంబుజ బృంగమాత్ర
శ్రీమహేంద్రాచల స్థిరహోరచాప
ఘనజటావల్కలోజ్జ్వల దివ్యరూప |శ్రీ|

14. శరణాగతత్రాణ సద్ధర్మ చరిత
శరదభ్రవిభ్రమోజ్యలకీర్తి సహిత
శ్రీవిభీషణ సమాశ్రిత పాదకమల
శుభదయాపరిపూర్ణ భవ్యహృత్కమల |శ్రీ|

15. ప్రళయార్ణవోదీర్ణ షటపత్రశయన
వితత సాగరతీర కృతదర్భశయన
బ్రహ్మాస్త్ర శోషితార్ణవ భీమరూప
బర్హిర్ముఖస్తుతాభేద్యప్రతాప |శ్రీ|

16. సేతుబంధోద్యుక్త సత్యసంకల్ప
చిక్రోడబంధమోచన నిర్వికల్ప
శ్రీసువేలాచలస్థితా దైత్యదమన
ప్రసృతవానరచమూయుతపద్మనయన ।శ్రీ

17. ఘనధనుర్ఘోష భీతాసుర ప్రకర
కరకాండఖండిత దైతేయనికర
ఖలకుంభకర్ణాసుర ప్రాణహరణ
వీరరసావేశ విక్రమాభరణ ।శ్రీ।

18. బ్రహ్మాస్త్రహ తదశాసన నిత్యసత్య
సకలగీర్వాణ సందోహసంస్తుత్య
వరపుష్పకస్థిత సీతాసమేత
సాకేతపుర గతాద్భుత పుణ్యచరిత ।శ్రీ।



19. సింహాసనస్థితాధిక కృపాపూర్ణ
మకరకుండలకర్ణ ఘననీలవర్ణ
నవరత్నకోటీర నవ్యప్రకాశ
నిష్కళంక నిరీహ నిఖిలలోకేశ ।శ్రీ।

20. జయ వేదగణదీప జయమీనరూప
జయకచ్ఛపశరీర జయనగోద్ధార
జయశ్వేతవారాహ జయ యజ్ఞదేహ
జయదైత్యమృగసింహ జయనారసింహ ।శ్రీ

21. జయత్రీవిక్రమరూప జయశార్ఙ్గచాప
జయ ధరాధిపభీమ జయపరశురామ
జయజానకీరమణ జయదివ్యచరణ
జయసంశ్రితాఘఘ్న జయప్రబలఘ్న ॥శ్రీ॥

22. జయదేవకీపుత్ర జయసుతామిత్ర
జయ మునీశ్వరభావ జయబుద్ధదేవ
జయహతాఖిలపాప జయకల్కిరూప
జయసర్వజగదీశ జయహృషీకేశ ।శ్రీ।

23. జయ ఘనాఘనవర్ణ జయదయాపూర్ణ
జయ పుండరీకాక్ష జయ రమావక్ష
జయముక్తజయగేయ జయమునిధ్యేయ
జయరత్నకోటీర జయమహాధార ।శ్రీ।

24. జయభవామయవైద్య జయవేదవేద్య
జయభక్తసురభూజ జయమహాతేజ
జయ సర్వసమ్మోద జయతీర్థపాద
జయ మందరోద్ధర జయవషట్కార ।శ్రీ।
మందరోద్ధార

25. జయపద్మదళనేత్ర జయజీవసూత్ర
జయసురారివిపక్ష జయసహస్రాక్ష
జయసుదర్శనహస్త జయసుప్రశస్త
జయనిత్యనిష్కలుష జయమహాపురుష ।శ్రీ।

26. జయత్రికాలాబాధ్య జయసదారాధ్య
జయభవార్ణవదూర జయనిర్వికార
జయసర్వసమభావ జయవాసుదేవ
జయభక్తజనగమ్య జయమహాసౌమ్య ।శ్రీ।

27. జయసత్యసంకల్ప జయశేషతల్ప
జయయోగినుతధామ జయపరంధామ
జయఖగాధిప వాహ జయదివ్యదేహ
జయజానకీరమణ జయపాపహరణ ।శ్రీ।

మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్.
శ్రీరామార్పణమస్తు.